Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మార్చి నెల 29 వ తేది శనివారం [నె 2 రు.

## స్పెయినుదేశ పరిస్థితులు.

### జర్మనుపక్షం చేరుతుందా, చేరదా?

[స్పెయిను ద్వీపకల్పం ఆఫ్రికాకు ఉత్తరంగాను, ఫ్రాంసుకి దక్షిణంగాను ఉంది. అటు అట్లాంటిక్, యిటు మధధరా సముద్రంలోను యీ దేశంయొక్క తీరంరేవులు గలవు. ఈ రెండు సముద్రాలను కలిపే జలసంధి జిబ్రాల్టరు స్పెయిను కొసనుంది. కాని ఆ రేవుమాత్రం బ్రిటిషువారిది.]

ఇపుడు జరుగుచున్న యుద్ధంలో రంగం మధ్యధరా సముద్రంనుండి అట్లాంటికు సముద్రానికిగూడ మారుతున్నది. కావున రెండు సముద్రాలకు మధ్యగావున్న స్పెయిను దేశంయొక్క నేటిస్థితి తెలిసికొనుట అవసరం. స్పెయినులో అంతః కలహం ముగిసి సీనరు అజానాగారి అధ్యక్షతలోనున్న ప్రజా ప్రభుత్వం అంతరించి, జనరలు ఫ్రాంకోగారి ప్రభుత్వం స్థాపించబడింది. ఫ్రాంకో సేనాని తిరుగుబాటునకు స్పెయిను దేశంలోని సైన్యమంతా సహాయం చేయడమేకాక, జర్మనీ ఇటలీలుగూడ సహాయం చేసినవి. స్పెయినులో ఉండిన ప్రజానుకూల ప్రభుత్వం, ఉదారమైన ప్రభుత్వంయొక్క అభివృద్ధి, నాజీలకు (జర్మనీకి) ఫాసిష్టులకు (ఇటలీకి) ఇష్టంలేదు. ఆ మాటకొస్తే, ఒక స్పెయినే ఏమిటి యూరోపులో ఎక్కడాకూడా పాప్యులరు ఫ్రంటు—అంటే ప్రజానుకూల ప్రజాప్రభుత్వాలు—పెరగడం వారికి యిష్టంలేదు. స్పెయినుకూడ తమ అక్షరాజ్యాల వర్గంలోకి రావాలని వారు కోరుతున్నారు. అందుకు ప్రజా ప్రభుత్వ నాయకులగు నగ్రిను, ప్రియిటో, కాబలరో మున్నగు వారికి ప్రతికూలంగా ఫ్రాంకో సేనానికి పూర్తిగా తోడ్పడి, అతని కృతజ్ఞత సంపాదించడమే మంచిదని యెంచిరి. స్పెయిను యుద్ధం యితర దేశాలకు ప్రాకకుండాలనే అభిలాషపడి ప్రజా ప్రభుత్వములు ఊరకుండుటచే, ఫ్రాంకో సేనాని స్పెయిను ప్రభుత్వమును పడగొట్టుట సులభమైనది. ఇటలీ 100,000 సేనను, జర్మనీ టాంకులు సైనికులు విమానాలను ఎక్కువగపంపి, అతనికి తోడ్పడ్డాయి.

### స్పెయిను యింకా కోలుకోలేదు.

స్పెయినులో యిప్పటికింకా శాంతి కుదురలేదు. అంతఃకలహంలో సుమారు పది లక్షలమంది చచ్చేరు. పరిశ్రమలకు వ్యవసాయానికి కలిగిన నష్టం పూడ్చుటకు ఎన్నేండ్లో పడుతుంది. వేలు లక్షలమంది యింకా జెయిళ్లలో మగ్గుచున్నారు. స్పెయిన్ను డిక్టేటరులాగ పరిపాలిస్తున్న జనరలు ఫ్రాంకో నిండు కొందరిని విడుదలచేసి, నేరస్తులను క్షమిస్తానని, దేశానికి సంపద చేకూరుస్తానని చెప్పిన మాట నిజమే. కాని దేశంలో మూంచిపలుకుబడి కట్టుదిట్టములుకల ఏకైక రాజకీయ సంస్థయగు ఫలాంగి పక్షానికీ రాజకీయ శత్రువులను అంతం చేసేమార్గం ఒకటే తెలుసు. కావున దేశ పునరుద్ధరణకు పనికొచ్చే శక్తివంతులగు జనం ఎందరో జెయిళ్లలో నిరుపయోగంగా ఉన్నారు.

నేటియుద్ధం ప్రారంభం కాగానే, ఫ్రాంకో తనదేశం తటస్థంగా ఉంటుందని ప్రకటించడంలో ఆశ్చర్యం లేదు. 1939 వ సం॥ మే నెలలో కమింటర్న (రషియా) ప్రతికూల ఒడంబడికయందు అతడు సంతకం చేసేడుకాని, అక్షరాజ్యాలతో (ఇటలీ జర్మనీలు) సైనిక సఖ్యతకు అంగీకరించలేదు. హిట్లరు అకస్మాత్తుగ కథకంమార్చి, రషియాతో ఒడంబడిక సంతకంచేయగానే అతడు దిగ్భ్రమచెందేడట. ఫ్రాంసు పడిపోయి, ఇటలీకూడ యుద్ధంలో చేరగానే, స్పెయిను అక్షరాజ్యాలకు మరింత సన్నిహితమయింది. తాటస్థ్యం వదలినప్పటికి, యుద్ధంలో కలవని రాజ్యంగానే ఉంది. స్పెయిను యువకులు జిబ్రాల్టరు తమకు తిరిగి కావాలని ఆందోళన ప్రారంభించేరు. కాని టాంజియరులో అంతర్జాతీయాధికారాన్ని త్రోసివేయడంతప్పితే, ఫ్రాంకో యింతవరకు మిత్రమండలికి ప్రతికూల చర్యలేమి చేయలేదు. ఆ టాంజియరులో అయినా బ్రిటిషువారి హక్కులు కాపాడుచు ఒడంబడిక చేసుకున్నారు. స్పెయిను ప్రచురణశాఖామంత్రి తమదేశం యీ యుద్ధంలో తటస్థంగానే యుండగలదని వేరొకసారి నమ్మకంగా చెప్పేడు. "మన నైసర్గిక పరిస్థితుల ననుసరించి ప్రమాదంకలదు కావున, అప్రమత్తులమై సాయుధాలతో సర్వదా సిద్ధంగా ఉండకతప్పద" ని మాత్రం అతడన్నాడు.

### జర్మనీ ఒత్తిడి.

స్పెయిన్ను మిత్రమండలికి ప్రతికూలంగా మార్చుటకు జర్మనీ ఎంతో ప్రయత్నం చేస్తున్నాది. కాని ఫ్రాంకో అంగీకరించలేదు. స్పెయిను రాజ్యంమీదుగ తమ సైనిక విమానాలను ఎగరనివ్వాలని జర్మనీ కోరగా, స్పెయిను దేశగౌరవమునకు యిది విరుద్ధమనిచెప్పి ఫ్రాంకో నిరాకరించినట్లుగా డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక రాజకీయ విలేఖరి వ్రానేడు. బెర్లినులోవున్న స్పెయిను రాయబారి యిందుకు అంగీకరించేడని జర్మనులన్నందున ఆతన్ని పనిలోనుండి తీసీసేడు. ఇటలీ, సిసిలీలందు జర్మనికి విమానాశ్రయాలు యిదివరకే ఉన్నాయి. అవి లిబియాకు మార్గంగా పనికి వచ్చును. కావున యిప్పుడు లిబియాకు క్రొత్త మార్గాన్ని జర్మనీ కోరడంలేదు. ఆఫ్రికా తీరమునందు పడమర కొసనున్న ఫ్రెంచి మొరోకోపైబడుటకు, స్పెయినుపై విమానమార్గమును జర్మనీ కోరియుండును. అక్కడనున్న ఫ్రెంచి సేనాధిపతి జనరలు వేగాండు ఉత్తర ఆఫ్రికాను యుద్ధంలో దింపే అక్షరాజ్యాల కోర్కెకు యింతవరకు ఒప్పుకోలేదు. ఇటీవలనే, ఫ్రెంచి మొరోకోలో సంధిని అమలు జరిపే ఉపసంఘమునందున్న ఇటలీవారికి తోడ్పడే సాకుతో చాలమంది నాజీ ఉద్యోగులను జర్మనీ అచటికి పంపెను. వారు ఫ్రెంచి మొరోకో సామ్రాజ్యాన్ని కూలద్రోయడానికి కుట్రలు పన్నుతూ ఉండవచ్చు. మొరోకో వ్యవహారములందు స్పెయినుకు గూడా సంబంధం ఉంది. టాంజియరులోనున్న మెండాబును స్పెయిను అధికారులు తొలగించారు. తనపై ఫ్రాంసు

ఆధిపత్యాన్ని అంగీకరించిన మొరాకో సుల్తాన్ను ఆ పదవి నుండి తప్పించి టాంజియరును తీసుకోడానికి ఫ్రాంకో ఎత్తు వేస్తున్నాడని ప్రతీతి. ఉత్తరాఫ్రికాలో ఫ్రెంచివారి పలుకుబడి చెడగొట్టడానికి స్పెయిను జర్మనీలుకూడ యింతవరకు ఒకే విధంగా ఎత్తులు వేస్తున్నా వీరిద్దరికి యిందు నిమిత్తం జగడం రాకమానదు.

## అక్షరాజ్యాలలో చీలిక.

స్పెయిను యుద్ధంలో తోడ్పడినందుకు యిరవై సాలుసరి వాయిదాలలో 2,750 లక్షల డాలరులు తమకు చెల్లించాలని ఇటలీ-స్పెయినులు ఫ్రాంకో సేనానికి బిల్లు యివ్వడంలోనే అక్షరాజ్యాల సామరస్యం చెడిందనవచ్చును. అంతర్యుద్ధం దెబ్బనుండి ఆర్థికంగా కోలుకోలేకుండా పడియున్న స్పెయినుకు యీ అప్పు చాలా కష్టంగానే ఉంటుంది. ఇంతవరకు యీ బిల్లు ఎందుకివ్వలేదా అనే ఆశ్చర్యం. ఒకవారం క్రిందటే ఫ్రాంకో ఇటలీకిపోయి ముసోలినీని చూచాడు. ఆఫ్రికాలో చిక్కుపడిన ఇటలీ సేనలను విడిపించుటకు ఇటలీ స్పెయిను సహాయాన్ని కోరింది. ఫ్రాంకో అందుకు సహాయంచేసియుంటే “అప్పు తీరింది” అన్న రసీదే పుచ్చుకొనియుండునేమో.

స్పెయిను శ్రేయానికి అవసరమని తోచినపుడల్లా ఫ్రాంకో అక్షరాజ్యాలకు లొంగక దట్టంగా ఉండెను. యూరోపులోనున్న అట్లాంటికు సముద్రతీరం అంతా తన చేతిక్రింద ఉంచుకోడానికి ఉద్దేశించి, పోర్చుగలును ఆక్రమించడానికి జర్మను సేనలను స్పెయినుమీదుగ పోనివ్వవలెనని జర్మనీ కోరెను. ఈ విషయం ఫ్రాంకోతో మాట్లాడ్డానికి హిట్లరు స్వయంగా స్పెయిను సరిహద్దులవద్దకు కొన్ని నెలలక్రిందట వచ్చినపుడు ఫ్రాంకో నిరాకరించేడు. తరువాత పైన చెప్పినట్లుగా, లిబియానుండి పారిపోవుచున్న ఇటలీ సేనలకు త్రోవయిచ్చుటకు ముసోలినికోర్కె నిరాకరించాడు. చివరకు స్పెయినుమీదుగ సైనిక విమానాలు పోవుటకు అనుమతించలేదు. కాని ఎంతకాలం యితడు అక్షరాజ్యాల ఒత్తిడిని యీలాగ ఎదిరించగలడు, ఎదిరించడానికి మనస్ఫూర్తిగ యిష్టం ఉందా అన్నదే సందేహం.

## అక్షరాజ్యాలకు అనుకూల శక్తులు.

కమింటర్న్ ప్రతికూల ఒడంబడికయందు ఫ్రాంకో సంతకం పెట్టినమాట నిజమే. కాని అంతమాత్రాన హిట్లరు ముసోలినీలకు సైనిక సహాయం చేయవలసిన విధి అతనికి లేదు—ప్రపంచానికి తెలియకుండా యింకేదైనా రహస్యపు ఒడంబడిక ఉంటేనేతప్ప. ఎట్లయినా జిబ్రాల్టరు రేవుపైని, ఉత్తరాఫ్రికాలో ఫ్రెంచి రాజ్యాలపైని స్పెయినుకి ఆశగలదని పైన చెప్పబడెను. యుద్ధంలో స్పెయిను సహాయంతో జర్మనీ గెలుస్తే, స్పెయిను పోర్చుగలును తీసుకొనుటకుగాని, దానిపై అధికారం చెలాయించడానికిగాని, వీలుండునని ఫ్రాంకో నమ్ముచుండవచ్చును; కష్టంలోనున్న తోడి నియంతల యెడల అతనికి సానుభూతి ఉండవచ్చు; వారి విజయంపైనే యికముందు అన్ని దేశాల నియంతల పాలన ఆధారపడి యుంటుందని అతను నమ్ముతున్నాడు; అతని బావమరదియగు విదేశాంగ మంత్రి సీనరు సరేనోసునరుగారు అక్షరాజ్యాలకు అనుకూలుడే. ఇవన్ని గమనించవలసిన ముఖ్య విషయాలు. ఫలాంగి పక్షం అక్షరాజ్యాల సిద్ధాంతాలను ఆమోదించింది. స్పెయిను పత్రికలు ప్రతిదినం వాటిని పొగడుతూ హిట్లరు ముసోలినీల పక్షం పూర్తిగ చేరిపోమని ఫ్రాంకోను ప్రోత్సాహించుచు వ్రాస్తున్నాయి.

## అక్షరాజ్యాలకు ప్రతికూల శక్తులు.

స్పెయినులో ఆహారపదార్థాలు చాలకుండా పోతున్నాయి. దేశీయార్థికస్థితి తారుమారయి రాజకీయ కక్షలు పెరిగాయి. జర్మనీ ఇటలీలు తీవ్ర యుద్ధ ప్రయత్నమందుండడంచేత స్పెయినుకి ఆహార పదార్థాలను అవి సప్లయి చేయలేవు. అట్టి సప్లయి ఇప్పుడు స్పెయినుకి ఇంగ్లాండు, అమెరికాలు ఇస్తున్నాయి. స్పెయిను డబ్బు కొంత ఇంగ్లాండులో ఉంది. అందుచే ఇంగ్లాండు పూచీపై, అనుమతిపై అమెరికా రెడ్‌క్రాసు సంఘంవారు, 10 లక్షల టన్నులకుపైగా గోధుమలు పంపిరి. స్పెయినుకి అవసరమగు మాంగనీసు లోహం, మాంసం, పాలు మున్నగు వస్తువులను పంపుటకు బ్రిటను సిద్ధంగా ఉంది. స్పెయినులో యీయేడు పండే నారింజపళ్లన్ని కొనడానికి ఇంగ్లాండు ఒప్పుకుంది. కావున యిందుకు బదులుగ అక్షరాజ్యాల ఆక్రమదాడులందు స్పెయిను తోడ్పడకుండా ఉండాలని అమెరికా ఇంగ్లాండులు కోరడం సహజం. అక్షరాజ్యాలు తప్పక జయించగలవని ఎంత ఎక్కువ ప్రచారంచేసినా, గ్రీసు లిబియాలందు ఇటలీ ఓడిపోవడం, జర్మను విమాన దాడిని ఇంగ్లాండు తిరుగగొట్టడం, జర్మను పరిశ్రమలకు రాయలు విమానాలు కలిగిస్తున్న నష్టం, బ్రిటిషు నౌకాదళ విజయాలు, యివన్నిచేరి ఫ్రాంకోపక్షంవారి నమ్మకాన్ని చెడగొడుతున్నాయి. మధ్యధరా సముద్రంలోను, అట్లాంటికులోను బ్రిటిషువారి నౌకాదళాధికారం, ఫ్రాంకోను కొంత హడలుకొట్టగలదు. శత్రువు ప్రత్యక్షంగా చూస్తుండగానే, తన సేనలను తీరాన దింపగలమని బ్రిటిషు నౌకాదళం నార్వే యుద్ధంలో లొఫొటెనుదీవియందు రుజువుచేసింది. స్పెయిను యుద్ధంలో దిగరాదని అమెరికా సలహా చెస్తున్నది. స్పెయిను జాతికి చెందిన, విజ్ఞానం సంబంధంగల దక్షిణ అమెరికా స్వతంత్ర రాష్ట్రాలుగూడ యీ సలహాను బలపరుస్తున్నాయి.

మధ్యధరాసముద్రం పడమట భాగంలో బ్రిటిషువారి యుద్ధనావలకు జిబ్రాల్టరు రేవు బలమయిన ముఖ్యస్థానంగా ఉంది. కాని యిచటి బ్రిటిషు నౌకాదళం నిరుపయోగం అయేలాగు చేయాలని జర్మనీ ప్రయత్నిస్తున్నది. అందుకొరకై స్పెయినులో కాటిజువద్ద, ఉత్తరాఫ్రికాలో కెంటావద్ద, పెద్ద ఫిరంగులను ఏర్పాటు చేసి జర్మనీ విమానాలను అచట సమకూర్చాలని ప్రయత్నిస్తున్నది. ఇటువంటి ప్రయత్నాలలో జర్మనీతో ఫ్రాంకో కలసిరానియెడల స్పెయిను దేశాన్నిగాని, అందులో కొంత భాగాన్నిగాని ఆక్రమించుటకు జర్మనీ పూనుకోవచ్చు. ఈ విషయంలో హిట్లరు కోరిక తీరడానికి చాలా అవకాశాలున్నాయనిన్ని, బాల్కను రాజ్యాలను ఆక్రమించడంకంటే, స్పెయిను దేశాన్ని ఆక్రమించడమే ఎక్కువ సులభసాధ్యమనిన్ని మేజరు ఫీల్డింగు ఇలియటు అనే గొప్ప సైనికవ్యవహార నిపుణుడు తలుస్తున్నాడు. స్పెయిను దేశాన్ని హిట్లరు ఆక్రమించినయెడల స్పెయిను పక్షాభిమానం వహించినట్టిన్ని లాటిను భాష మాట్లాడే ప్రజలున్నటువంటిన్ని దక్షిణ అమెరికా రాజ్యాలకు చాల ఆగ్రహం కలుగగలదు. అవికూడ జర్మనీపై యుద్ధం ప్రకటింపవచ్చును. అటువంటి పనికి ప్రతీకారంగా అట్లాంటికు సముద్రంలో స్పెయినుకున్నూ పోర్చుగలుకున్నూ చెందినటువంటి కొన్ని దీవులను, పైజెప్పిన దక్షిణ అమెరికా దేశాలవారు ఆక్రమించుకోవచ్చును. ఇటువంటిది జరిగినప్పటికిని జర్మనులు బహుశః లక్ష్యంచేయరు. ఎట్లాగయినా సరే వీలైనంత వేగంగా యుద్ధంలో జయించడమే జర్మనీకి కావల

సినపని. యుద్ధం దీర్ఘకాలం జరిగితే జర్మనీ తప్పకుండా ఓడిపోతుందని సజరు ఫీల్డ్ గు ఎలియటుగారే అన్నారు.

స్పెయిను దేశంలోకి జర్మనీ ప్రవేశించినయెడల, జర్మనీకి క్రొత్తశత్రువు ఏర్పడతాడనే భయం హిట్లరుకు లేదు. స్పెయిన్ను అణచి ఉంచడానికి ఆదేశంలో పెద్ద పటాలాలను ఉంచవలసిన అవసరంకూడా లేదు. కనుక స్పెయినులో కొన్ని విమానాశ్రయాలేర్పరచుకొని, అచ్చటనుండి ఆ విమానాలను యుద్ధరంగాలకు పంపవచ్చును. ఇటువంటి పరిస్థితులేర్పడితే బ్రిటిషువారు దానికి తగిన క్రొత్త వ్యూహాలను పన్నగలరు. జిబ్రాల్టరుగుండాగాని స్పెయినులోని మరో రేవుగుండాగాని, బ్రిటిషువారు తగినన్ని సేనలను స్పెయినులోకి పంపించి జిబ్రాల్టరుయొక్క వెనుక భాగమును బందోబస్తుచేయగలరు. అక్కడ 50,000 బ్రిటిషు సైనికులుపోరాడకొని ఉన్నయెడల వారిని కదలించడానికి జర్మనులు చాల కష్టనష్టాల పాలవుతారు. ఇంకొకవైపున స్పెయిను ప్రజలు తిండిలేక మాడుతు, జర్మనులంటే అభిమానంలేక అసహ్యించుకుంటూ, స్పెయినులో దిగిన జర్మనులమీదనే తిరుగుబాటు చేయగలరు. సుమారొక 150 సంవత్సరముల క్రిందట స్పెయినులో ఫ్రెంచి పటాలములకు యిట్టిగతియే పట్టింది. ఫ్రెంచి చక్రవర్తియగు నెపోలియను అప్పుడు తన సేనలను స్పెయినుమీదుగ నడిపించి చాల చిక్కులపాలయినాడు. అందుకే బ్రిటిషు సేనాని విలింగుటను అతన్ని ఓడించగలిగెను. ఆదేవిధంగా యీమాటు గూడ ప్రపంచ దిగ్విజయానికై ప్రాకులాడే మరొక సాహస పురుషుని ఆశలకు ఆ స్పెయినే సమాధి భూమి కావచ్చును.

# ఈ వారంలో యుద్ధం.

## జర్మనీపై బ్రిటిషు విమాన దాడి.

ఈ వారం బ్రిటిషు విమానాలు ఫ్రాంసు కోస్తా రేవు పట్నాలమీద, జర్మనీయందలి ఆయుధ నిర్మాణశాలలుగల నగరాలమీద తీవ్రమైన దాడి జరిపినవి. "లోరియంటు" అను ఫ్రాంసు రేవులో జర్మనులు నౌకాదళం, సబుమెరైనుల కేంద్రముంచిరి అటునుండి అట్లాంటికు సముద్రంపైకి వెళ్లి, ఆ మార్గంగా బ్రిటనుకువచ్చే నావలకుపద్రవం కలిగిస్తున్నవి. అందుచేత గత గురువారంనాడు వందలకొలది బ్రిటిషు విమానాలు లోరియంటుపైకి వెళ్లి వేలకొలది బాంబులను వేశాయి. ఆ రేవులోనుండి లేచిన మంటలు, ప్రేలుడు శబ్దలు ఎంతో దూరానికి వినపడినవి. శత్రువులకు అపారమైన నష్టం కలిగిందని రుజువయింది. ఈ లోరియంటుపై దాడి యిదివరకు 47 సారులు జరిగెను. శుక్రవారం రాత్రిగూడ దాడి కొనసాగెను. వాతావరణం అనుకూలంగా లేకపోవడంచేత జర్మనీమీదకు శనివారంవరకు దాడి పోలేదు.

కాని ఆదివారం రాత్రి మాత్రం బెర్లిను నగరంమీద, నౌకా నిర్మాణశాలయగు "కీలు" రేవుపట్నంపైని, రైల్వే జంక్షనగు హనోవరుమీద భయంకరమగు దాడి సాగించినవి. బెర్లిను నగరంపై 10 వేల బాంబులు పడినవి. క్రిందనున్న ఫిరంగుల గుండ్లను లక్ష్యంచేయక నగరంమధ్యను బ్రిటిషు విమానాలు చొచ్చుకొనివచ్చినవనియు, చాల ప్రదేశములలో బాంబులవలన పెద్ద అగ్నిజ్వాలలు లేచెననియు జర్మనులే అంగీకరిస్తు ప్రకటన చేసేరు. హనోవరులోను కీలుకెనాలులోనుగూడ బ్రిటిషు బాంబులు మంటలు కలుగచేసినవి. బెర్లినుపై యిది ౬౯ వ దాడి.

హాలెండు, డెన్మార్కు, బెల్జియం, ఫ్రాంసు తీరాలలో జర్మనులు దాడి సన్నాహాలు చేసుకొనుచున్న ఇతర రేవు పట్నాలమీదగూడ బ్రిటిషు విమానాలు దాడులు సాగించినవి. ఆ కోస్తాలలో లేచినమంటలు ఇంగ్లాండు తీరానికి కనబడ్డాయి. బ్రిటిషు విమానాలచే విశేషనష్టం కలుగుచున్నందున జర్మనులు పరిశ్రమలుగల పట్నాలనుండి బెర్లినునుండి వేలకొలది బిడ్డలను స్త్రీలను ఖాళీచేయించి, తూర్పు ప్రాంతాలకు, ఆస్ట్రియాకు పంపిస్తున్నారు. ఈ వారం హాంబర్గు నుండి 59,000 బిడ్డలను 100 మంది మేస్టరులను పంపివేసిరి. ఫ్రాంకుఫర్టునుండిగూడ చాల వేలమందిని స్లోవోకియాకు పంపుచున్నారు.

బెర్లిను నగరంమీద బ్రిటిషు విమానదాడులు తీవ్రమవటంచేత రాజధానిని అక్కడనుండి మార్చుటకు నాజీ నాయకులుద్దేశిస్తున్నారు. ఆస్ట్రియా రాజధానిగానున్న వియన్నా నగరాన్నే జర్మనీకి అంతటికి రాజధానిగ చేసుకోవాలని, అక్కడవుంటే బ్రిటిషువారి విమానదాడులకు అందకుండా వుండవచ్చునని హిట్లరు అనుకుంటున్నాడు. అందుకే కాబోలు వియన్నాలో వున్న యూదులను, జెక్కులను జర్మను అధికారులు వెళ్లగొట్టడం ప్రారంభించేరు.

బ్రిటిషు విమానాలు రోజూ సాగిస్తున్న దాడులవలన జర్మనీలోనున్న రైలు మార్గాలు చెడి ప్రయాణాలకు చాల కష్టంగా వుంది. బెర్లినులో భూమిలోవుండే రైల్వేలకుగూడ దెబ్బతగిలి కూలిపోయినవి.

## బ్రిటనుపై జర్మను విమానదాడి.

జర్మను విమానాలుగూడ రోజూ కొలదిగనో గొప్పగనో బ్రిటనుపై దాడి సాగిస్తున్నాయి. ప్లిమతు పట్నం బ్రిటిషు దక్షిణ తీరాన పెద్ద రేవుపట్నం. చాల నౌకలు అక్కడ ఉంటాయి. గురువారం పగలే శ్రీ రాజ దంపతులు ప్లిమతు రేవును పరీక్షించి వెళ్లేరు. రాత్రి శత్రువిమానాలు తరంగాలుగావచ్చి "వడగండ్ల వానవలె" బాంబులను వర్షం కురిపించినవి. ఇంత తీవ్రమగు దాడి యిదివరకెప్పుడు జరుగలేదనుకున్నారు. మరునాటి సాయంత్రము కూడా శత్రువిమానాలు వచ్చి తొలినాటికన్న తీవ్రమగు దాడిజరిపి వేలకొలది బాంబులను వెదజల్లి వెళ్లినవి. ఈ రెండు రోజులలో ప్లిమతు నగరానికి చాలనష్టం కలిగింది. వర్తకభవనాలే కాక, ప్రజల స్వంత ఆస్తులు, 3 చర్చిలు, 2 ఆస్పత్రులు, సినిమాలుగూడ శిథిలమైనవి.

శుక్రవారం రాత్రి బాంబులు ముమ్మరంగా పడుచున్నపుడే, ఆస్ట్రేలియా ప్రధాని మెంజిసుగారు అచటికి వచ్చేరు. పడుచున్న బాంబులను లక్ష్యం పెట్టకుండానే అన్ని ప్రాంతాలలోను తిరిగి, ప్రజల కష్టాలను స్వయంగా చూసేరు. తమ మోటారుకూడ గాయపడినవారిని ఆస్పత్రికి తీసుకపోవుటకై ఒసంగిరి. రాజ దంపతులు మరల ప్లిమతువచ్చి బాధితులను చూచి, ప్రజల ధైర్యమును కొనియాడివెడలిరి. ఆదాడిలో 10 సంవత్సరములలోపు పిల్లలు, ఒక ప్రసూతి వైద్యశాలలో స్త్రీలు, పిల్లలు చాలమంది చనిపోయిరి. నర్సులు, వైద్యులు

కడు ధైర్యంతో మెలంగి బాంబులు పడుచుండగనే నొప్పులు పడుచున్న ఒక స్త్రీకి సుఖంగా పురుడు పోసిరి. ఆ భయంకర దృశ్యంలో ఇట్టి సాహసధైర్య గాథలెన్నో జరిగినవి.

ఆ రెండు రోజులు బ్రిటిషు దక్షిణతీరాన మరికొన్ని ప్రాంతాలలోగూడ బాంబులు పడినవి కాని ఎక్కువ నష్టం కలుగలేదు. శని ఆదివారములందు దాడిలేదు. ఆదివారం పగలు కొన్ని శత్రువిమానాలు రాగా తూర్పు ఆంగ్లియా రాష్ట్రమునందు రెంటిని బ్రిటిషు ఫిరంగులు పగులగొట్టినవి. మార్చి 15 వ తేదీతో అంతమయ్యే వారంలో 44 శత్రు విమానాలు పడగొట్టబడినవి. బ్రిటిషువారిది ఒక్కటే పోయింది. తరువాత వారంలో 6 శత్రు విమానాలు బ్రిటనులో పడగొట్టబడినవి.

22 వ తేదీనుండి లండనుపై రాత్రి దాడులు పూర్తిగా ఆగిపోయినాయి. సోమవారంనాడు ఉదయం ఇంగ్లాండు ఆగ్నేయ ప్రాంతంలోను, నైరుతి భాగంలోను మాత్రం కొలదిగా బాంబులు పడ్డాయి. ఒక శత్రువిమానాన్ని ఫిరంగులతో పడగొట్టిరి. మంగళవారంనాడు పగలొక విమానం వచ్చిపోయింది. బుధవారంనాడు పగలు ఒక్కొక్కటిగ కొన్ని విమానాలు వచ్చి ఇంగ్లాండు దక్షిణభాగంమీద అచ్చటచ్చట బాంబులు వేసిపోయినవి. రెండు పట్నాలలో చాల యిళ్లు పడిపోయినవి. కాని జననష్టం చాల తక్కువ. మరునాడు రెండు విమానాలను పడగొట్టిరి.

## ఆల్బేనియా యుద్ధరంగం.

ఆల్బేనియాలో గ్రీకులకు ఇటలీవారికి జరిగిన యుద్ధమునందు ఇటలీ సైనికులు గత వారం చనిపోయినవారు, గాయపడినవారు సుమారు 25 వేలమంది ఉంటారని లెక్కతేలింది. గ్రీకుల వశమయిన ఖయిదీలలో ముసోలీని దగ్గరబంధువగు కర్నలు టివెరీగారుగలరు. ఫాసిస్టు నాయకులలో నొకరగు నికోలిజియానిగారు యుద్ధరంగంలోనే చనిపోయిరి. గ్రీకు సైన్యాలను ఒక్క గజమైనా వెనుకకు ఇటలీ సైన్యాలు పంపలేకపోయినవి. గ్రీకు లెదిర్చే సరికి ఇటలీ సైన్యాలే మరికొంత ప్రాంతాన్ని వారికి వశంచేయవలసి వచ్చింది. ఈ వారం గ్రీసు సైన్యాలపై ఇటాలియనులు పెద్ద దాడులను సాగించలేదు. టెపెలీని మొదలగు ప్రాంతాలలో కందకాలు త్రవ్వుకొని, ప్రాకారాలు కట్టుకొంటున్నారు. దీనినిబట్టి చూస్తే గ్రీసుపై దాడి వెడలే ఆశ వదలుకొని, గ్రీకులే తమ పైకివస్తే నిలువరించుకొనే యేర్పాటులో ఉన్నారని యెంచవచ్చును.

25, 26 వ తేదీలందు ఇటాలియను సైనికులు ఆవూస్-అధోస్ నదులకు మధ్య ప్రాంతాన్ని తిరిగి స్వాధీనం చేసుకోడానికి తీవ్రమయిన దాడులే సాగించారు. ఇటలీవారు గ్రీకు సైనిక పంక్తులను సమీపించి సంకుల యుద్ధం సాగించేరు. కాని గ్రీకు సైనికుల సన్నీలపోటులకు నిలవలేక పారిపోవడం ప్రారంభించిరి. చాలమంది ఇటలీ సైనికులు నాయకులతో సహా ఖయిదీలుగ పట్టుపడిరి. తరువాత గ్రీకు సైనికులు శత్రు శిబిరాలనుగూడ ఆక్రమించేరు. అచట చాల మందుగుండు సామానులు ఆయుధములు గ్రీకులకు దొరికాయి.

## ఆఫ్రికాలో విజయము.

ఉత్తర ఆఫ్రికాలో లిబియా ప్రాంతమునందున్న బ్రిటిషు సైన్యాలు, సముద్ర తీరాన దక్షిణ ప్రాంతాలలో యింకా నిలచియున్న ఇటాలియనులను మెల్లగా పట్టుకొంటున్నారు. ఈ వారం టోబ్రూకు రేవుకు 150 మైళ్ల దూరమున దక్షిణంగానున్న జిరాబబ్ అనే ప్రదేశాన్ని పట్టుకున్నారు. అచటనున్న 800 ఇటాలియను సైన్యం మొదటి దెబ్బకే లొంగిపోయెను.

తూర్పు ఆఫ్రికాలో ఇటలీ సైనికులు ఎక్కువ ధైర్యంతో ప్రతిఘటిస్తున్నారు, కాని బ్రిటిషు సైనికబలం యెదుట అన్ని రంగాలలోను వెనుకకు పోవడం తప్పడంలేదు. 16 వ తేదిన బెర్బరాలో దిగిన బ్రిటిషు సైన్యములు 24 వ తేది సరికి బ్రిటిషు సోమలిలాండును ఆక్రమించుకొనియుండిన ఇటలీ సైన్యాలన్నింటిని తరుమగొట్టి దేశాన్నంతను తిరిగి ఆక్రమించుకొన్నవి.

అబిసీనియాలో ఇటలివారి సైనిక కేంద్రములగు డిరేడేవా, హరారు పట్టణములపై బ్రిటిషువారు బాంబులు వేసిరి. జిబూటీకు పడమటగానున్న "మర్దాపాస్" వద్దనున్న ఇటాలియను సైనికనిలయములను, బ్రిటిషు సైన్యములు ఎదిర్చి, చాలముఖ్యమగు ప్రదేశాన్ని ఆక్రమించినవి.

27 వ తేదిన అబిసీనియాలో హరార్, ఇరిట్రియాలో కెరేను బ్రిటిషువారాక్రమించుకొనిరి. హరర్ అడిసు అబాబాను ప్రవేశించుటకు సింహద్వారంలాంటిది. అక్కడ పెద్ద దుర్గప్రాకారాలు ఏమిలేవుకాని 12,000 లోపుగ ఇటలీసైన్యం ఉంది. ఈ పట్టణాన్ని బ్రిటిషు సైన్యాలు పట్టుకోవడంవలన, అడిసు అబాబునుండి జిబూటీ రేవునకు వెళ్లే రైలు మార్గం బ్రిటిషు స్వాధీనమవుతుంది. అబిసీనియాలోనున్న ఇటాలియనులు ఆమార్గాన్ని తప్పించుకోడానికి వీలులేదు. ఇక అబిసీనియా దక్షిణ ప్రాంతంలోగల నెగెల్లి పట్నంనుండి మరికొన్ని బ్రిటిషు సైన్యాలు, అడిస్ అబాబాపైకి వేగంగా సాగిపోవుచున్నాయి.

ఇరిట్రియా రాజధానియగు కెరేన్ దుర్గాన్నిగూడ విడువారాలు ముట్టడి సాగించిన పిదప యీ వారం బ్రిటిషు సైన్యాలు ఆక్రమించగలిగినాయి. దీనితో ఇరిట్రియాలో మూడింట రెండు వంతులు బ్రిటిషువారి స్వాధీనమైనది.

లిబియాలో బెంఘాజి రేవుకు దక్షిణంగా 180 మైళ్ల దూరానవున్న, ఎల్ అఘీలాస, అను ప్రదేశాన్ని ఉత్తర ఆఫ్రికాలో దిగిన జర్మను సైనికదళాలు పట్టుకున్నాయని జర్మనులు ప్రకటిస్తున్నారు. కాని అది అంత ముఖ్యమైన స్థలంకాదని, అదివరకు బ్రిటిషు సైనికులు ఇటలీ సైన్యాల నోడించి ఆక్రమించినప్పటికీ, యిపుడు ఖాళీచేయుటచే, జర్మనులాక్రమించగలిగిరి.

ఆఫ్రికా రంగంలో ఇటలీ సర్వ సేనాధిపతిగానుండిన మార్షలు గ్రేజియానీ తన పదవికి రాజీనామానిచ్చెను. ఇటలోగారి బార్డిగాలని, యితనిస్థానే సర్వ సేనాధిపతిగను, లిబియాకు గవర్నరుగను నియమించారు. గత అక్టోబరులో గ్రీసుపై దాడి సాగించినప్పటినుండి ఇంతవరకు పిద్దరు పెద్దసైనికాధికారు లీవిధంగా తొలగింపబడ్డారు. దీనినిబట్టి ఆఫ్రికాలోను, ఆల్బేనియాలోను కలుగుతున్న పరాజయాలకు ఇటాలియనులు ఎంతకలవరపడుచున్నారో తెలుస్తున్నది.

## విషీ ప్రభుత్వం.

ఫ్రాంసునకు అమెరికానుండి రెండు నౌకల నిండా ఆహార పదార్థాలను పోనిచ్చుటకు బ్రిటిషు ప్రభుత్వంవారు అంగీకరించారు. కష్టదశలోనున్న ఫ్రాంసు ప్రజలకు దానంగా అమెరికను రెడ్ క్రాసు సంఘంవారు యీ సరకును పంపిరి. వారే ప్రజలకు పంచిపెట్టెదరు. ఈ

సరకును యితర ఆహార పదార్థములను, జర్మనీవశమందున్న ఫ్రాంసు దేశ భాగాలకు పంపమని విషీప్రభుత్వంవారు (పెటెనుగారి ప్రభుత్వం) బ్రిటిషువారికి హామియిచ్చిరి. 23 వ తేదిన ఉత్తరాఫ్రికానుండి కొన్ని ఫ్రాంసు నౌకలు చిన్నయుద్ధ నౌకల రక్షణతో బయలుదేరి, జిబ్రాల్టరు జలసంధి గుండా దక్షిణ అమెరికా ప్రాంతములకు వెళ్లినవి. బ్రిటిషు వారు అడ్డగించలేదు.

## అమెరికా సహాయం.

బ్రిటనుకు సహాయంచేయుటకు 700 కోట్ల డాలరులను మంజూరు చేయమని అధ్యక్షుడు రూజువెల్టుగారు గావించిన సూచనను అమెరికా సెనేటు సభవారు ఎక్కువ ప్రతిఘటన లేకుండనే ఆమోదించిరి. అనుకూలురు 67 గురు, ప్రతికూలురు 9 గురు. బ్రిటను సహాయ చట్టం సెనేటులో ఎట్టి మార్పులు లేకనే అంగీకరింపబడి, అధ్యక్షుని సంతకముగుటచే వెంటనే అమలునకు వచ్చింది. బ్రిటనుకు ఆయుధ సామగ్రితోపాటు, 20 వేల విమానాలను, 400 వర్తక నౌకలను గూడ ఇచ్చుటకు అమెరికా ఏర్పాటు చేస్తున్నది. ఆ విమానాలన్ని 18 నెలలలో పూర్తిగ బ్రిటనుకుచేరతాయి. విమానాల ఉత్పత్తి చాల హెచ్చింది. ఫిబ్రవరిలో అమెరికా సంయుక్త రాష్ట్రములందు 3,750 విమానాలు తయారయినాయి. అమెరికా యుద్ధ నౌకలు కొన్ని యీ వారం తూర్పున న్యూజిలండు ఆస్ట్రేలియా దేశాలకువచ్చి ఆ ప్రాంతాలను పరిచయంచేసుకొని వెళ్లినవి. అమెరికాకు ఒకేసారి తూర్పున పడమరనుగూడ యుద్ధం వచ్చినచో ప్రతిఘటించడానికి తగినంత నౌకాదళం నిర్మించడానికి సెనేటు 8,620 లక్ష డాలరులను మంజూరు చేసింది. ఇవిగాక పసిఫిక్కు మహాసముద్రమునందు సామోదీవులందును, ఇంగ్లాండునుండి పుచ్చుకున్న దీవులందును నౌకా విమాన నిలయములను నిర్మించుటకు 3,450 లక్షల డాలరులను మంజూరుచేస్తు సెనేటువారు మరి రెండు చట్టాలనుగూడ ఆమోదించారు.

రూజువెల్టుగారికి అంతరంగ మిత్రుడగు టోనోవనుగారు, యిటీవలనే యూరోపులో యుద్ధం జరుగుచున్న దేశాలన్ని చూచివచ్చిరి. వీరు, అమెరికా యిదివరకే తాటస్థ్యంవదలి మిత్రమండలిలో చేరినదని, అందుచే బహిరంగంగా జర్మనీపై వెంటనే యుద్ధం ప్రకటించి, యుద్ధంలో దిగాలని హెచ్చరించారు. స్వయంగా చూచివచ్చిన వారగుటచే, యుద్ధ పరిస్థితులను గురించి వారికి తెలిసినంత యింతెవ్వరికిని తెలియదు. జర్మనులు అమెరికా యునైటెడు స్టేట్సుతో రాజకీయ సంబంధాలను త్రెంపి వేసికోవలసి వస్తుందని తెలిసి సిద్ధమవుచున్నారు. యునైటెడు స్టేట్సులోనున్న జర్మనులలో యువకులనందరను ఇదివరకే ఖాళీ చేసిరావలసినదని ఉత్తరువు చేశారు. ఈ వారం స్త్రీలనుగూడ ఖాళీచేయించి తీసుకుపోతున్నారు.

## జపాను.

జపాను విదేశాంగ మంత్రియగు మట్సు ఓకాగారు జర్మనీ, ఇటలీ దేశాలకు పోవుచు త్రోవలో మాస్కోనగరంలో దిగి, రషియా విదేశాంగ మంత్రియగు మలటోవుగారితో ప్రసంగించిరి. సాధారణంగా రాజకీయ చర్చలందు పాల్గొనని రషియానియంత స్టాలినుగారు ఆ సంభాషణకు హాజరగుటలో ఏదో విశేషంగలదనుకుంటున్నారు. మట్సు ఓకాగారు అచట బ్రిటిషు రాయబారియగు సర్ స్టాఫర్డు క్రిప్సుగారిని గూడ చూచి మాట్లాడిరి. పత్రికల విలేఖరులతో మాట్లాడుచు, తాను ప్రత్యేకం పనిమీద రాలేదనియు, జర్మనీ నాయకుల పరిచయం కలిగించుకొనుట మంచిదను ఉద్దేశంతో వెళ్లుచుంటిననియు తెలియచేసేడు.

మట్సు ఓకాగారు బుధవారంనాడు బెర్లిను నగరం చేరినపుడు, జర్మను విదేశాంగమంత్రి, అక్ష-రాజ్యాల ప్రతినిధులు గొప్పస్వాగత మొసంగిరి.

## యుగోస్లోవియాలో వింతమార్పులు.

బాల్కనులలో, యుగోస్లోవియాను యెట్టులైన స్వాధీన పరచుకోడానికి జర్మనులు సాగించిన కుట్రలు ఈ వారం మొదట్లో ఫలించినట్లు కన్పించినవి కాని రెండు రోజుల లోనే, ఆదేశంలో గొప్ప తిరుగబాటు జరిగి, జర్మను తంత్రాలన్నీ వికటించి జర్మనికే బెడిసికొట్టినాయి.

జర్మనులు మొదట యుగోస్లావియాకు తీవ్రమైన షరతులే తెలియజేసారు. (1) బల్గేరియా, రుమేనియాలవలె యుగోస్లావియాకూడ ఇటలీ-జర్మనీలతో చేరవలెనని, (2) యుగోస్లావియాగుండా జర్మను సైన్యాలు గ్రీసుమీదకు వెళ్లడానికి సౌకర్యాల నొసగవలెననీ, వారి షరతులలో ప్రధానమైనవి. కాని యుగోస్లావియా అందు కంగీకరించలేదు. పిమ్మట జర్మనీ తన షరతులు తగ్గించుకొనినది. (1) జర్మనీ-ఇటలీ-జపానులు గావించుకొనిన ఒడంబడికలో చేరుట. (2) యుగోస్లావియాగుండా రైళ్లలో యుద్ధ సామగ్రిని, క్షతగాత్రులను పంపుకొనుటకు అనుమతించుట. ఈ రెండు షరతులకు అంగీకరిస్తే చాలునన్నారు.

ఇవి బల్గేరియా, రుమేనియాలకు జర్మను లొసగిన షరతులకంటే చాల తక్కువే. యుగోస్లావియాగుండ జర్మను సైన్యాలను పంపుకొను షరతులను జర్మనులు వదలుకున్నారు. కాని దీనికిగూడ యుగోస్లావియా ప్రజలు అంగీకరించలేదు. జర్మనీ-ఇటలీలతో ఏమాత్రం చేరరాదనీ, దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవడానికి యుద్ధానికైనా సిద్ధపడవలెనని ప్రజలు అందోళన సాగించారు. అయినా, మంత్రివర్గంలో యెక్కువమంది యుద్ధానికి జడిచి, జర్మను షరతును అంగీకరించుటకు నిశ్చయించారు. మైనరగు పీటరు రాజు తరఫున పరిపాలనాధికారిగనున్న పాలు రాకొమారుడుగూడ ఆ నిర్ణయానికి అనుమతి నిచ్చాడు. ఆ నిర్ణయం ఇష్టంలేని మంత్రులు ముగ్గురు రాజీనామా యిచ్చారు. దేశంలోని ప్రముఖులందరు వలదని హెచ్చరిస్తున్నా వినక, ప్రధాన మంత్రి విదేశాంగ మంత్రి, 25 వ తేదిన వియన్నాకు జని అచట హిట్లరు సమక్షంలో యుగోస్లావియానుగూడ ఇటలీ-జర్మను-జపాను ఒడంబడికలో చేరుస్తూ ఒడంబడికలపై సంతకము చేశారు.

మంత్రివర్గం, జర్మనీవైపు చేరుచు ఒడంబడిక గావించుకొనినదని తెలియగానే యుగోస్లావియాయంతటా ప్రభుత్వ చర్యను ఖండిస్తూ బ్రహ్మాండమైన ఆర్భాటాలు జరిగాయి. ప్రజల ప్రాతికూల్యం, సైనిక, నౌకావిమానశాఖల ప్రాతికూల్యంచూచి స్వెట్కోవిచ్ గారి మంత్రివర్గం 27 వ తేదీన రాజీనామానిచ్చింది. పాలు రాకుమారుడు, తన పరిపాలనాధికారం వదలుకొని అన్ని అధికారాలను మైనరుగు పీటరు రాజుకే సమర్పిస్తూ, తాను భార్యతోకూడ దేశంనుండి పారిపోయాడు. 17½ సంవత్సరముల వయస్సు మాత్రమే గల పీటరు రాజే అధికారాలన్నిటిని వహించి, జెనరలు సిమొవిచ్ గారిని ప్రధాన మంత్రిగ నియమించాడు. అతను, జర్మనీ-ఇటలీలలతో జేరుటకు నిరాకరించి రాజీనామా నొసగిన ముగ్గురుమంత్రులను, అన్ని పక్షముల నాయకులను కలిపి నాటి మధ్యాహ్నం 2 గంటలకే క్రొత్త మంత్రి వర్గాన్ని నియమిం

చాడు. అంతవరకు ప్రధానిగనున్న స్వెట్కొవిచ్‌గారిని అక్షరాజ్యాలతో చేరుటకు అనుకూలంగనున్న ఇతర మంత్రులనందరను నిర్బంధమునందుంచుటకు ఉత్తరువుచేశాడు.

క్రొత్త ప్రభుత్వానికి సైనిక శాఖలన్నీ సంపూర్ణమైన భక్తి విశ్వాసాలతో విధేయులమై వర్తిస్తామని రాజభక్తి ప్రమాణాలుచేశారు. ఇంగ్లాండు, అమెరికా ప్రభుత్వాలు, ఇటలీ-జర్మనీలను ప్రతిఘటించుటకు అమిత నిశ్చయంతోనున్న క్రొత్త యుగోస్లావు ప్రభుత్వానికి పూర్తిగా సహాయంచేస్తామని ప్రకటించాయి. యుగోస్లావియాను బుట్టలోవేసుకొన్నామని విజయగర్వంతోఉన్న జర్మనీకి, రెండు రోజులలో వ్యవహారాలన్నీ తలక్రిందై ఇట్టి పరాభవం జరిగింది.

## టర్కీ.

టర్కీ పరిస్థితులుగూడ ఈ వారం చాలఅనుకూలంగామారినవి. జర్మనీతో తాము యుద్ధానికి దిగవలసివస్తే రషియా వైఖరి యెట్లావుంటుందో తెలియకపోవటంవలన ఇంతవరకు టర్కీ ధైర్యంగా వ్యవహరింపజాలక పోతున్నది. అట్టి స్థితిలో సోవియటు రష్యాకూడ దాడివచ్చి టర్కీలో పూర్వభాగాన్ని ఆక్రమంచునేమోనని టర్కీ నాయకులు భయపడుచున్నారు, కాని ఈ వారం, సోవియటు ప్రభుత్వంవారు టర్కీకి గావించిన వాగ్దానంవలన ఆభయం తొలగినది. జర్మనీతో టర్కీ యుద్ధానికి దిగితే రష్యా తటస్థంగావుంటుంది గాని టర్కీకి చిక్కు కలిగింపదని సోవియటు అధికారులిపుడు అభయం ఇచ్చారు. ఇందువలన, బ్రిటను గ్రీసు యునైటెడుస్టేట్సులతోగలసి జర్మనీని ప్రతిఘటించుట కింతవరకున్న టర్కీకిగల అనుమానాలు తొలగిపోయినవి.

ఈ విధంగా, బాల్కనులలో జర్మనీయొక్క స్థితి విషమమగుచున్నది.

## మధ్యధరా రంగం.

మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకాదళం శత్రు నౌకలను వెదకివెదకి కొట్టుచున్నది. వేర్వేరు యుద్ధరంగాలలోని బ్రిటిషు సైన్యాలకు సప్లైల చేరవేయు నౌకలకు కాపలాగా ప్రయాణంచేస్తూ శత్రుయుద్ధ నౌకలకోసం ఎంతవెదకినా కనపించలేదు. వేయచూడవచ్చిన ఒక శత్రువిమానాన్ని మాత్రం పడగొట్టినవి.

గత ఆదివారంనాడు చాల జర్మను విమానాలు మాల్టాదీవిపై దాడివచ్చి బాంబులువేసినవి. వానిలో 13 విమానాలు పడగొట్టబడినవి.

## నౌకా నష్టాలు.

జర్మనులు, బ్రిటనుకు సరకులు అందకుండా చేయడానికిగాను అట్లాంటికు సముద్రం ఉత్తరానవున్న 'గ్రీన్‌ల్యాండు' తీరానికి మూడు మైళ్ల దూరంవరకు నౌకా దిగ్బంధనాన్ని వ్యాపింపజేశామనీ, ఆ సరిహద్దు దాటి బ్రిటనువైపుకు యేనౌకలన్నా వస్తే ప్రమాదానికి లోనౌతాయనీ ప్రకటించారు. దీనికి ప్రతిక్రియలను యునైటెడు స్టేట్సువారాలోచిస్తున్నారు.

బ్రిటనుపై దిగ్బంధనానికి, అట్లాంటికు సముద్రంలో జర్మనులు సాగించు నౌకా విమానయుద్ధంలో, బ్రిటను సంపూర్ణంగా విజయమందగలదని, బ్రిటిషు ప్రధానమంత్రి చర్చిలుగారు 27 వ తేదీన సంపూర్ణమైన విశ్వాసంతో ప్రకటించారు. ఆ యుద్ధంలో జర్మనులు పూర్తిగా నిర్మూలింపబడిన వార్తను కొలది నెలలలోనే ప్రకటింపగలననిగూడ ఆయన తెలియజేశాడు.

చర్చిలు ప్రధాని ప్రకటనయందు లేశమైనా అతిశయోక్తి లేదని, గతవారం, నౌకా నష్టాలవలన తెలుస్తున్నది. రెండు వారాలక్రిందట బ్రిటిషువారివి, మిత్రమండలివి కలపి 1 లక్ష 40 వేల టన్నులు నౌకలను శత్రులు ముంచివేశారు. గడచినవారం ఆ మొత్తం ఒకలక్ష టన్నులకు తగ్గింది. మార్చి 16 వ తేదీతో ముగిసిన వారంలో వీనిసంఖ్య 71,773 టన్నులకు తగ్గింది. గత 5 వారాలలోను శత్రునౌకలు 3 లక్షల టన్నులవరకును నష్టమైనాయి. అదిగాక 8,516 టన్నుల తరగతి "ఓడరు" అను జర్మనునౌక, ఆఫ్రికాతీరమునందలి మస్సావా రేవునుండి ఎర్రసముద్రంలో ప్రయాణం చేస్తుంటే, చిన్న బ్రిటిషుయుద్ధనౌక ఒకటి అడ్డగించి స్వాధీనపరచుకొంది 26 వ తేదీన నార్వేతీరంలో ఒక బ్రిటిషు సబుమెరైను జర్మనుసైన్యాలకు సరకులను సప్లైచేస్తున్న ఒక జర్మనునౌకను ముంచివేసింది. డచ్చితీరంలో 6,000 టన్నుల మరియొక జర్మనునౌకగూడ అలాగే ముంచివేయబడింది.

## యుగోస్లావియా—అక్షరాజ్యాలతో సఖ్యత.

ఒక వారమంతా అవును-కాదు అను వార్తలు వదంతులు వ్యాపించిన పిమ్మట యుగోస్లావియా కూడు అక్షరాజ్యాల ఒడంబడికలో సంతకంచేసింది. జర్మనీ-ఇటలీ-జపాను యీ మూడు గావించుకొన్న అన్యోన్య సహకార ఒడంబడికయందు యిదివరకే బల్గేరియా, రుమేనియాలు చేరినవి. ఇపుడు యుగోస్లావియాకూడ చేరినది. జర్మనీ తరఫున రిబెన్ట్రాఫ్ గారు, ఇటలీ తరఫున కేంటు కియానోగారు జపాను తరఫున జనరల్ ఓషియాగారు, యుగోస్లావియా తరఫున ప్రధాని సెవెటుకొవిచి, విదేశాంగ మంత్రి సింకరు మార్కొవిచిగార్లు, వియన్నాలో యీ ఒడంబడికయందు సంతకములు చేసిరి. యుగోస్లాయా మంత్రులను కలుసుకొనుటకు హిట్లరు స్వయంగా వియన్నాకుపోయెను. ఇదో గొప్ప రాజనీతి విజయంగా జర్మను రేడియో ప్రకటించింది.

ప్రస్తుతం యీ ఒడంబడికలో ఏమి ప్రమాదం కనబడకపోయినా, కాలక్రమేణా జర్మనీ యుగోస్లావియానుండి ఎన్నో సౌకర్యములు గుంజుకోగలదు. దీనికి నిరసనం దెల్పుచు యిరువురు సెర్వియను మంత్రులు రాజీనామా నీయగా వారి స్థానే ఎవరో తెలియనివ్యక్తులను మంత్రులుగ వేసుకొని ప్రధాని రాజ్యాంగములో సతఖ్యత ఉన్నట్లే చూపివేసెను. సైన్యాన్ని బారకాసనుండి కదలరాదని ఆజ్ఞాపించి సభలన్ని నిషేధించినను, ప్రజల ప్రతికూల ప్రబోధములు అణచ వీలు లేకుండెను. రీజెంటు పాలుగారి రేడియో ఉపన్యాసం వాయిదా వేయవలసివచ్చెను. జరిగిందిరద్దుచేసి, జర్మనుకుట్లయుగోస్లావియా తనవైఖరిని మార్చుకొనేటట్లు చేయ ప్రజానాయకులు పట్టుపట్టియున్నారు. మార్చి 27 వ తేదని రక్తపాతములేని ఆశ్చర్యకరమైన ఒక సైనిక సంఘటన తటాలున జరిగింది. బాలుడైన పీటరు రాజు పరిపాలనను తన వశము చేసుకొని సర్బియను సైన్యములో చాలకాలము పనిచేసిన జెనరల్ సిమోవిచ్‌గారిని దేశనాయకునిగా నియమించాడు. సీనియరు రీజెంటుఅయిన ప్రిన్సుపాల్ తన భార్యతోగూడ దేశమునుండి పారిపోయినాడు. రీజెన్సీ తాలూకా యితర సభ్యులు తమ సభ్యత్వమునకు రాజీనామా నిచ్చారు అక్షరాజ్యలతో సంధి చేసుకొన్న ప్రధాన మంత్రిని యితర మంత్రులను పట్టుకొన్నారు. హిట్లరుకు ఆశ్చర్యం కలిగించియుండే యీ విషయములతోపాటు దేశములో జర్మను వ్యతిరేక, ప్రదర్శనములు జరిగాయి.

ఇంగ్లాండుపక్షాన విన్స్టన్ చర్చిలుగారును యునైటెడ్ స్టేట్సుపక్షాన సమ్నర్ వెల్సుగారును, యుగోస్లేవియాలో

జరిగిన యీ విప్లవమును మెచ్చుకొన్నారు. శత్రువులుమీదికి వస్తే తాము సాయము చేస్తామని యుగోస్లేవియాకు అభయమిచ్చారు.

### హిట్లరు అసంతృప్తి.

ఇవి యిలాగుండగా ఒడంబడిక షరతులు హిట్లరుకి అసంతృప్తిగా ఉన్నాయిట. ఇందు సైనిక సహాయం షరతులేమి లేవాయెను. రెండు విషయాలగూర్చి అభయం యిస్తూ రిబెన్‌ట్రాఫ్ రాసి యిస్తేగాని యుగోస్లావియా ప్రధాని ఒడంబడికలో సంతకం చేయలేదు. అవేవనగా—

“యుగోస్లావియా స్వాతంత్ర్యమును దేశైక్యతను జర్మనీ ఎల్లపుడు గౌరవించును.

“యుద్ధ సమయమునందు అక్షరాజ్యాల ప్రభుత్వములు యుగోస్లావియామీదుగ తమ సైన్యాలు పోవుటకు దారియిమ్మని కోరవు.”

జర్మనీ ఒసంగిన యీ అభయమునకు ఎంత విలువ యివ్వాలో అందరికి తెలును. మూసియుండు వాగనులలో యుద్ధ సామగ్రిని, గాయపడిన ఖైదీలను యుగోస్లావియా మీదుగ తీసుకొనిపోవుటకు జర్మనీకి హక్కుగలదు. కావున యిందుకొరకే యుగోస్లావియా అంతటిలో జర్మను ఉద్యోగులు ప్రవేశింపవచ్చును. తరువాత వారు దేశీయ వ్యవహారములందు జోక్యం కలిగించుకొందురు. హిట్లరు వాగ్దానాలన్ని చెల్లించడానికి చేయడని ప్రపంచంలో అందరు ఎరుంగుదురు.

### ఫ్రాంసు ఆహారం జర్మనీ తీసుకొంటాది.

ఇంగ్లాండు దిగ్బంధంచేయక తప్పదు.

ఫ్రాంసుకు రెండు స్టీమరుల గోధుమపిండి విదేశాలనుండి వచ్చుటకు ఇంగ్లాండు అంగీకరించి దిగ్బంధం సడలించి మార్గమొసగినది. ఇది ఎంతవరకు మంచిదని అనేకులు ఆలోచించుచున్నారు.

ఫ్రాంసుయొక్క మొత్తం పంటలో మూడింట రెండువంతులు పండే పల్లపు జిల్లాలను జర్మనీ ఆక్రమించింది. అక్కడ పంటలన్ని జర్మనులు తీసుకుంటున్నారు. కావున గోధుమలు, ధాన్యం చాలక ఫ్రాంసులో ప్రజలు కష్టపడుచున్నారు. అందుచే అమెరికావారు కనికరించి ఫ్రెంచి ప్రజలకు రెండు స్టీమరుల గోధుమపిండి పంపేరు. దానిని ప్రజలకు పంచియిచ్చే పూచీకూడా అమెరికా రెడ్ క్రాసు సంఘంవారికే ఒప్పగించేరు. అంతా బాగానేఉంది. కాని ఫ్రాంసుకి పంపిన వస్తువులు జర్మనీకి చెందిపోతూవుంటే, శత్రువుని మేపడానికి ఇంగ్లాండు తోడ్పడం భావ్యమేనా? శత్రు దేశాలకు ఆహార పదార్థాలు, ఆయుధ సామగ్రి చెందకుండా వారించడం సామాన్యమయిన యుద్ధనీతి. ఈ నీతిననుసరించి ఇంగ్లాండు జర్మనీకి, జర్మనీ ఆక్రమించిన ఫ్రాంసుకి దిగ్బంధం చేసింది. ఇపుడీబంధం సడలించి రెండు స్టీమరులను ఫ్రాంసుకి పోనిచ్చుటను కొందరు ఆక్షేపిస్తున్నారు.

జర్మనీ ఆక్రమించిన ప్రదేశాలలో తగిన ఆహారంచేకూర్చు బాధ్యత జర్మనీపై గలదు. అమెరికా తనకిచ్చిన సరకు జర్మనీ దొంగలించకుండా చేయగలనని, విషీప్రభుత్వం మాటయిచ్చినా ప్రయోజనంలేదు. ఏమంటే విషీప్రభుత్వం హిట్లరు ఖైదీవలె వుంది కనుక, ఫ్రాంసుకి సహాయం చేయాలని ఇంగ్లాండుకి ఎంత యిష్టం వున్నా జర్మను దిగ్బంధమును సడలింపజాలదు. జర్మనీకి దిగ్బంధంవలన ఒత్తిడికలిగించి యుద్ధం మానుకొనేటట్లు చేసి, యూరోపు ప్రజలను రక్షింపవచ్చును. వేరు మార్గంలేదు.

ఉత్తరాఫ్రికాలోనున్న ఫ్రాంసు వలసరాజ్యాలనుండి ఫ్రాంసునకు యిప్పుడు ధాన్యాలు, పండ్లు, నూనె విత్తులు మొదలగునవి పంపబడుచున్నాయి. విషీప్రభుత్వంక్రింద నున్న ఫ్రాంసుకి ఆఫ్రికా వలసరాజ్యాలకు మధ్యజరుగు వ్యాపారాన్ని ఇంగ్లాండు నిరోధింపలేదు. అందుచేత ఫ్రాంసు దక్షిణరేవగు మార్సెలీసులో ఇటలీ-జర్మనీల సమిష్టి సంఘం ఒకటి ఎక్కువ అధికారంవహించి ఆఫ్రికానుండి వచ్చే సరకును ఇటలీ జర్మనీలకు పంపివేయుచున్నది.

కాని హిట్లరు ప్రచురణశాఖ మంత్రియగు డాక్టర్ గోయిబెల్సు మాత్రం అనేక సందర్భములందు అనేక దేశాలకు అనేకవిధాల చెపుతూ ఉంటాడు. యూరోపులో కావలసినంత ఆహార పదార్థాలున్నాయని ఒకసారి జర్మను రేడియోలో తెలిపెను. జర్మనీ ఆక్రమించిన దేశాలలో ఆహారం సప్లయి పూచీ జర్మనీకి లేదని యింకోసారి చెప్పేడు. ఇపుడు యింకోరీతి చెప్పి, లండను విషీప్రభుత్వములకు తగవుపెట్టదలచెను. బ్రిటిషువారి దిగ్బంధం కటుతరంగా నుండబట్టి, ఫ్రాన్సుకి తిండిలేకుండా ఉందంటున్నాడు.

ఈ సమస్యకు చాల చిక్కులు గలవు. దీనికి రెండు పరిష్కార మార్గాలను సుప్రసిద్ధ బ్రిటిషు రాజకీయవేత్తయగు వెర్నను బార్ట్లెటుగారు సూచించేరు. జర్మనీకి నిలువయుంచుకోగల శక్తి యెక్కువగుటకు ఇంగ్లాండు తోడ్పడుట ఆత్మహత్య చేసుకొనుటవంటిది. ఇంగ్లాండు ఏవో షరతులు విధించాలి. విషీప్రభుత్వం అందుకంగీకరించాలి. స్పెయినులోవలె ఇంగ్లాండు—అమెరికాల ఉపసంఘమే ఆహారపదార్థాలను పంచుటకు విషీ అంగీకరించాలి. రెండవది, విషీప్రభుత్వం తమకు ఎంతవరకు అనుకూలంగా ఉందో ఇంగ్లాండుకు తెలియాలి.

పడమటి ఆఫ్రికా రేవు స్థలం కాసబ్లాంకా, డేకరులు జర్మనీ అధికారమునందున్నచో అమెరికా ఇంగ్లాండుకి చేయు సహాయం నిరోధింపబడగలదు. అడ్మిరలు డార్లను గారు (విషీప్రభుత్వ ప్రధాని) యిప్పటివలెనే ప్రవర్తించుచో మధ్యధరా సముద్రమునందు జిబ్రాల్టారును, మరికొన్ని రేవులను ఉత్తరాఫ్రికాలో విమానాలు దిగేచోటులను జర్మనీ పతాకం క్రిందకుపోతాయి. కావున మార్షలు పెటేను, అడ్మిరలు డార్లాన్, జనరలు వేగాండుగార్లు (విషీప్రభుత్వాధికారులు) ముందేమిచేయదలచిరో తెలుసుకొని అందుకనుగుణ్యంగా బ్రిటిషు ప్రభుత్వం ప్రవర్తించుట మంచిదని బార్ట్లెటుగారు సూచించేరు.

### అమెరికా సహాయం.

సరకు రక్షణకు అధ్యక్షుడే పూచీపడునా?

ఇంగ్లాండుకు సహాయంచేయడానికి 70,000 లక్షల డాలరులను నమోజుచేయు చట్టాన్ని అమెరికా సెనేటు సభ ఆమోదించినందున, సరకును ఇంగ్లాండుకు అతివడిగా పంపేదెట్లా అని అమెరికా ప్రభుత్వం ఆలోచిస్తున్నది. 18 నెలలలో ఇంగ్లాండుకొరకు 20,000 విమానాలు అమెరికా తయారుచేస్తుందని, బ్రిటిషు యుద్ధ నౌకలను అమెరికా రేవులలో మరమ్మతు చేసుకోనిస్తారని, 400 వర్తక నౌకలను కట్టియిస్తారని ప్రకటింపబడింది. అట్లాంటికు సముద్రంలో జర్మను యుద్ధ నౌకలు, సబ్‌మెరైనులు పొంచి

యుండి, యుద్ధం సాగిస్తున్నాయి. వారి విమానాలుకూడ చురుకుగ పనిచేస్తున్నాయి అయినా అట్లాంటికు యుద్ధం నుండి తప్పించి, తమ సరకును ఇంగ్లాండుకి చేర్చే బాధ్యత కూడ అమెరికా వహిస్తుందనికూడా అంటున్నారు. సరకు రవానాకు రక్షణ యుద్ధ నౌకలను పంపుటనుగూర్చి అమెరికాలో తీవ్రంగా చర్చింపబడుచున్నది. అవును, కౌలు చట్టంలో రక్షణ యొసంగవలెనని అధ్యక్షునకు స్పష్టంగా అధికారం యివ్వకపోయినా అమెరికా సర్వసేనాధిపతిగా అధ్యక్షుడు తన నౌకాదళమును యిందుకు వినియోగింపవచ్చును. సరకు చేరేమార్గం చూడకపోతే యీ సహాయ చట్టం ఉపయోగం వుండదు. చట్టం చేయబడింది కనుక, యింక సరకు ఇంగ్లాండుకు పంపడానికి అవాంతరాలేమి వుండవని కొందరనకుంటారు. ఇంగ్లాండుకి సహాయం చేయడానికి అమెరికా స్వరక్షణ శక్తిని అధ్యక్షుడు తగ్గించజాలడు. కొన్ని వర్తక నౌకలను, సబుమెరైనులను వెతికే మోటారు టార్పెడో పడవలను, ఆహార పదార్థాలను ఆయుధాలను వెంటనే పంపడానికి సిద్ధంగా ఉన్నాయి. కాని అవి ఎక్కువగానుండవు.

అట్లాంటికు యుద్ధంలో ఇంగ్లాండుకు అమెరికా తోడ్పడ వచ్చును. కాని అమెరికాలోని అపారమగు పరిశ్రమల సహాయం ఇంగ్లాండు పూర్తిగ బడయుటకు కొంతకాలం పట్టును.

<u>అమెరికా ఉత్పత్తి</u>

అమెరికాలో ఆయుధ సంపత్తిగూర్చి బాంకరు అను బ్రిటిషు పత్రిక యిట్లు అంచనా వేసెను :—

"1941 వ సంవత్సరములో అమెరికా ఆయుధాల కొరకు ఉపద్రదంగా ఖర్చుచేస్తున్నది. ఇంగ్లాండు ఇపుడెంత ఖర్చు చేస్తున్నదో అంతవుండును. అందు సగం వరకు ఇంగ్లాండునకు ఒసంగబడినచో ఇంగ్లాండు యొక్క యుద్ధ ప్రయత్నం సగానికి సగం హెచ్చి, జర్మనీని మించి పోవును. 1942 వ సంవత్సరం ఖర్చు కూడా అమెరికాకు కష్టంగా ఉండదు. అమెరికాలో దాగియున్న ఆస్తులు ధనం యింకా ఉపయోగించనేలేదు. జర్మనీ సంపద అప్పుడే కరిగిపోయింది. 1941 వ సంవత్సరం ప్రారంభం వరకు ఇంగ్లీషువారు 3,300 లక్షలు పౌనుల విలువగల సరకును అమెరికానుండి పొందిరని అమెరికామంత్రి మార్గెం తో ప్రకటించెను. అంటే ఇంగ్లాండు ఉత్పత్తిలో నాల్గవ వంతుకన్న తక్కువే. 1941 వ సంవత్సరంలో బ్రిటిషు ఉత్పత్తిలో ⅓ వంతు అమెరికానుండి చేరగలదు. 1942 వ సంవత్సరములో బ్రిటనులో యెంత ఉత్పత్తి కాగలదో అందు లోసగం వంతు అమెరికా అదనంగా పంపగలదు. 1943-44 వ సంవత్సరములలోగూడా యుద్ధం వుంటే ప్రపంచంలో ఏదేశం చేయలేనంత యెక్కువ ఉత్పత్తి అమెరికా చేసి మనం (బ్రిటిషువారు) ఎంత ఉత్పత్తి చేస్తున్నామో అంత మనకు పంపగలదు.

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు క్రమముగా భద్రపరుచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.